# సఫల జీవనము






"నేను నరకములో కూడ ఉత్తమ గ్రంథముల జనువ
రెదను. ఏలననగా ఉత్తమ గ్రంథములు నరకమును కూడ
ర్గముగ మార్చివేయ గలవు."

— 'లోకమాన్య' బాలగంగాధర తిలక్



తిపిర్నేని లక్ష్మీనారాయణ

# సఫల జీవనము

రచన

**జేమ్స్ ఎలన్**

అనువాదము

**తిపిర్నేని లక్ష్మీనారాయణ**

ద్వితీయ ముద్రణము
1983 ఆగస్టు



ప్ర కా శ కు డు
**తిపిర్నేని లక్ష్మీనారాయణ**
హిందీ ప్రచారక్,
రామకృష్ణ గ్రంథమండలి
పటమట, విజయవాడ - 6

వెల
రు. 4/-

సర్వోదయ ప్రెస్
విజయవాడ - 6



స్వాతంత్ర్య సమరయోధులు,
గ్రంథాలయోద్యమ వైతాళికులు,
గాంధీజీ నిర్మాణ కార్యక్రమ ప్రచారకులు,
నా శ్రేయోభిలాషులునగు
**'కళాప్రపూర్ణ' స్వర్గీయ పాతూరి నాగభూషణం**
గారి స్మృతి చిహ్నముగ
వారి కుమార్తె
**శ్రీమతి రావి శారద**
గారి విరాళముచే ముద్రితము

**— తిపిర్నేని లక్ష్మీనారాయణ**

# మొదటి కూర్పుకు తొలిపలుకు

మానవుల్లో అధికాంశం ఏదోగా బ్రతికి చస్తున్నామే కాని, ఈలాంటి ఉత్తమ జన్మనెత్తినందుకు మొత్తంమీద సార్థకత కనిపించడంలేదు. మనలను మనమే యిట్లా అను ద్వేషించడం ఆత్మవంచనగా కొందరికి తోచవచ్చునేమో కాని, నిజం మాత్రం అంతే. ఈ నిజాన్ని తమలోతామూ, తోడి మనుష్యుల్లోనూ అవగతం చేసుకోగలవారే ఆత్మవంతులు. అంతేకాదు - తపస్సువల్ల, అనుష్ఠానం వల్ల వారే ధర్మాధికారులు, ఉత్తమ దేశికులుకూడ అవుతారు. వారే లేకపోతే ప్రపంచానికి బ్రతుకు తెరువేలేదు - నిజమైన చరిత్రేలేదు. ప్రజారాధకులే ఏ జాతిచరిత్రకైనా ప్రాణప్రతిష్ఠ చేయగలవారు. ప్రజాసేవే ప్రజారక్షకు ఏకైకసాధనం. అన్నం, నీళ్ళు ఈ బొందెకు మాత్రమే-అది వున్నంతవరకే. కేవలం అంగరక్షతో మన బ్రతుకులు కడతేరవు. అత్యవసరం ఆత్మరక్ష. ఈ "శైలవాహిని" ఇక్కడనే యింకిపోకుండా, దీనిని "అమృతార్ణవం" చేర్చే అభయ హస్తం ఆత్మజ్ఞానం. ఈ దుర్బల కీటకం మంటిలో పుట్టి మంటిలోనే మగ్గిపోకుండా, దాన్ని అనంతపథానికెత్తి నడిపించే చిరసారథి అది.

ఇట్టి దివ్యభాగ్యాన్ని అనుభవించలేక దిగద్రోసుకొనే దరిద్రలోకానికి దారిచూపే మహాత్యాగులు అనాదిగా ప్రపంచంలో అవశ్యంగా అవతరిస్తూనే వచ్చారు. చారిత్రకయుగంలో మనుష్యుల మానసిక మాంద్యాన్ని విదళించే ప్రతిజ్ఞా పాలనలో అక్షరాలా అసువులర్పించిన మహాపురుషుడు సోక్రటీసు. బ్రతికినన్నాళ్ళు ధర్మదుందుభి మోగించి, చచ్చికూడా ఖండాంతరాలను ఆత్మతేజంతో నింపివేసిన మహిమాన్వితుడు

గౌతమబుద్ధుడు. రక్తమాంసాల రుచిని అడుగంట అణగ ద్రొక్కి, బద్ధశత్రువులతో పరమమైత్రి నెరపి శిలువనెక్కిన కారుణ్యమూర్తి జీససాకరు; అజ్ఞాన తిమిరంలో బహుముఖాల మానుషత్వాన్ని కోల్పోయిన స్వజాతీయులను పరిశుద్ధాస్తికులుగా జేయనెంచిన "ఏకమేవాఽద్వితీయ" మంత్రద్రష్టమహమ్మదు పైగంబరొకడు-మనుష్యులున్నంత కాలం సూర్యచంద్రుల్లాగు వెలుగుతూనే వుంటారు.

ప్రపంచ జాతులన్నింటిలోను పైమహనీయుల అడుగుజాడల్లో తాము బ్రతికి, తోడిమానవులను బ్రతికించిన సెయింట్ పాల్‌లు, జాన్‌లు, నానకులు, కబీర్లు, రామకృష్ణులు, రామ్మోహన్‌లు, మోహన్‌దాసులు-ఇట్లా పెద్ద, చిన్న ఆత్మజ్యోతులెన్నో ప్రభవించి, పృథ్విని పునీతం చేశాయి, చేస్తున్నాయి. ఈ చిన్న పుస్తకంకూడ నిస్సందేహంగా ఆ జ్యోతుల వరుసలో ఒక రత్నదీపం. గ్రంథకర్త శ్రీ జేమ్సు ఎలన్‌చే వ్రాయబడి శ్రీ లక్ష్మీనారాయణగారిచే తెనిగింపబడ్డ వేరొక గ్రంథం "జీవనపథము"నకిది సోదరి సంపుటం—చేదోడు. "సత్సంకల్పం", "సత్యభాషణ", "సత్కర్మ"ల నుండి "సత్ఫలితాలు" వచ్చి తీరుతాయి. సఫల జీవనానికి అన్యపంథాలేదు. ఇటువంటి పారమార్థిక గ్రంథ ప్రచురణనే పనిగా పెట్టుకొన్న శ్రీ లక్ష్మీనారాయణగారి ఉద్యమం మిగుల ప్రశంసనీయం. ఈ ప్రచురణలోని విషయం ఉన్నతం, శైలి మృదుమధురం అని వేరుగ చెప్పబనిలేదు.

రాజమహేంద్రవరం
15-1-1963

**తల్లాప్రగడ ప్రకాశరాయుడు**

# వి ష య సూ చి క


1. సత్సిద్ధాంతములు 1-11

 ౧ కర్తవ్యము

 ౨ నిజాయితీ

 ౩ మితవ్యయము

 ౪ ఔదార్యము

 ౫ ఇంద్రియ నిగ్రహము

2. ఉత్తమ నియమములు 12-18

3. సత్కర్మలు 19-25

4. సత్యభాషణము 26-32

5. సమదృష్టి 33-36

6. సత్ఫలితము 37-44

# సత్సిద్ధాంతములు

జీవితమున మనము చేసి తీరవలసిన పనులు ఎన్నియో కలవు. కాని ఏ పని ముందు చేయవలెను, ఏ పనికి ముందు ఏ పని చేయవలెను? అనునది నిశితముగ, దీర్ఘముగ యోచించి నిశ్చయించుకొనవలసిన విషయము. మనము చేయుపనులకు ముందు వెనుకలు నిర్ణయించుకొనుటపైననే ఫలసిద్ధి ఆధారపడి యున్నది. కనుక ఈ నిర్ణయము అత్యంత మహత్తర మయినది. ఏ కార్యమునేని ఆదినుండియే ఆరంభింపదగును గాని మధ్యనుండిగాని, అంతమునుండి గాని ప్రారంభింపదగదు. చిత్తము వచ్చినట్లు పనిచేసుకొని పోవుట, ఆ పనిని తారుమారు చేయుటయే యగును. మల్లుడు మొదటనే గొలుసును త్రెంచ ప్రయత్నించుచో నతడు తప్పక విఫల మనోరథు డగుట యాఖాయి. మొదటాతడు తన విద్యను వ్యాయామముతో ప్రారంభించి తద్విద్యారహస్యముల క్రమక్రమముగ ఉన్నతి నందుచుండును. అపుడే అతడు మల్లవిద్యావిశారదుడయి ప్రజా ప్రశంసల నందుకొని పారితోషికముల బడయును. క్రమోన్నతియే కార్య సాఫల్యము నకు మూలము. అభీష్టసిద్ధికి ఉత్తమ క్రమారంభమే అత్యంతావశ్యకము మఱి ప్రశంసార్హము.

ఏ విద్యార్థియు తన చదువును ముందుగ సాహిత్యము తోను, బీజ గణితముతోను ప్రారంభింపడు. మొదటాతడు

అక్షరములు, అంకెలు నేర్చుకొనును. అనంతరము సత్సంకల్పము, నిరంతరకృషి తదేక నిష్ఠాగరిష్ఠత, సాధనా సంపత్తులచే సాహిత్యము, గణితశాస్త్రములందు అతని చిత్తమును లగ్నము చేయును. సరిగ మానవజీవితమునకును ఈసూత్రమే వర్తింపగలదు. ఉద్యమశీలుడగు ప్రతి మనుష్యుడును మూలమునుండియే కార్యారంభము చేయదగును. అపుడతడు తప్పక సఫల మనోరథుడగును. అంతట కార్యసిద్ధి స్థిరమయి నదిగ నుండగలదు. చిన్నిపనుల నేని కడు ఓరిమితో చేయునట్టియు, వాని నభ్యసించుటలో లేశమేని సంకోచింపనట్టియు, చిరకాలముగ మానవజాతి సాధించిన సామాన్యానుభవములను సయితము తిరస్కరింపనట్టియు, జాతి పరముగ లభించిన సదుపదేశములను అవహేళన చేయనట్టియు ధార్మికపురుషులు ఆత్మజ్ఞాన బుద్ధి ప్రాభవముల సర్వోన్నత శిఖరము నధిష్ఠింతురు. ఇట్టివారే ఆత్మజ్ఞాన సంపన్నులు, అసాధారణ ప్రజ్ఞావంతులు, అఖండ దివ్యజ్ఞాన తేజో విరాజితులు కాగలుగుచున్నారు.

నిష్కళంకము, సుఖసంపన్నము, సఫలము నగు జీవితమునకు ప్రాథమిక విషయములే సత్సిద్ధాంతములు. మనుష్యుడిట్టి సిద్ధాంతములను జీవితారంభమునుండియే అభ్యసింపనిచో వాని ఆరంభములు, అభ్యాసములు అనుచితములుగ నుండగలవు. తుదకట్టి మానవుని జీవితము క్లిష్టము, క్లేశభరితము నగును. విశ్వమందలి సకల వ్యాపారములు, వ్యవహారములు, విజ్ఞానములకు ఆధారభూతములగు వివిధములగు గణిత శాస్త్రములు మనచే సామాన్యముగ దలంపబడు పది

అంకెలమీదనే ఆధారపడి యున్నవి. ఉత్తమ భావముల కాలవాలము, ప్రశస్తజ్ఞానమునకు కాణాచియగు జగత్ప్రసిద్ధ సాహిత్యమునకు ఆధారభూతములగు శతకోటి గ్రంథములును కొలది యక్షరముల సాయముననే రచింపబడుట సకల జన విదితము. ఎంతటి సుప్రసిద్ధ జ్యోతిశ్శాస్త్ర పండితు డయినను ఈ పది అంకెలు లేనిదే చేయగలుగునదేమియు నుండదు. ఎంతటి కుశాగ్రబుద్ధిగల విద్యాంసుడు సయితము మొదట 'ఓ, న, మా'లు అభ్యసింపనిదే కార్యసిద్ధి నంద జాలడు. ఈ రీతిగనే సృష్ట్యాదినుండి నేటివరకు ఈ ప్రపంచ మున నుత్పత్తిల్లిన సమస్తా లోచనలకును, భావ పరంపరలకును ఆధారభూతములగు మూల నియమములు సహజములు; స్వల్ప సంఖ్యాకములు. కాని అట్టి నియమముల బరిశీలింపనిదే, పరామర్శించనిదే మనకు జ్ఞానము ప్రాప్తించదు మఱి కార్య సిద్ధియు కలుగనేరదు. మానవ జీవితమునకు సంబంధించిన మూల నియమములు, సుస్థిర సిద్ధాంతములు సయితము సులభ సాధ్యములు; అల్ప సంఖ్యాకములు. అట్టి సిద్ధాంతముల సమగ్రముగ నభ్యసించి జీవితమందలి ప్రతి దశయందును వాని ననుసరించు నభ్యాసమునకు గడంగుట వలన జీవితమున సంఘటిల్లు అనేకాందోళనములు, గందరగోళములు అంతరింప గలవు. అంతట మనుష్యునకు సుస్థిరమగు చరిత్రము, చిరస్థాయి యగు సఫలత కనురూపమగు సంఘటనశక్తిని సంపాదించుటకు మూలాధార మేర్పడగలదు. ఆ సిద్ధాంతముల నాచరించు టలోగల చిక్కులను దెలుసుకొని వానిని నిర్మాణాత్మకముగ రూపొందించుకొనుటలో విజయుడగు మానవుడు తన జీవిత

మున కధిపతి యగుచున్నాడు. అనుష్ఠాన యోగ్యములగు సిద్ధాంతములే జీవితముయొక్క ప్రాథమిక సిద్ధాంతములు. వానిని వల్లించినంత మాత్రమునగలుగు లాభము శూన్యము. వాని ననుష్ఠించినపుడే ప్రయోజనము కలుగును. ఈ ప్రాథమిక సహజ సిద్ధాంతములే మానవ జీవితమందలి సమస్త కార్య కలాపములకును స్థాయీ కారణభూతములనియు, వీనిని వర్జించుట సాధ్యముగాని పనియనియు అనుభవముద్వారా గ్రహించుకొనిన వ్యక్తులు చాలా అరిదిగ నున్నారు. ఈ చిన్ని పుస్తకములో జీవితమున కక్కఱకువచ్చు ప్రాథమిక సిద్ధాంతములలోని నైదింటిని గూర్చి మాత్రమే చర్చింతము. ఇందు చర్చించు అయిదు సిద్ధాంతములు జీవితముయొక్క సరిశాతి సరళములగు మూల సిద్ధాంతములకు జెందినవే. ఇవి మన దైనందిన జీవితములో సర్వోపయోగము లయినవి. ఇవి వ్యాపారి, శిల్పి, గృహస్థుడు, వారు వీరననేల ప్రతివాని నిత్య కార్యకలాపములతో సన్నిహిత సంబంధము గలిగి యున్నవి. మనము వీనిలో ఏ ఒక్కదానిని త్యజించినను గొప్ప కష్టమునకు, నష్టములకు గురి యగుదుము. మానవ జీవితమున కత్యంత ప్రయోజనకరములగు నీ సిద్ధాంతముల నభ్యసించి ఆచరించు మానవుడు తన జీవితమందు ఘటిల్లించు ననేక కష్టములను, నష్టములను, ఆపదలను, అపజయములను అవలీలగ అతిక్రమింపగలడు. అట్టి మానవుడు శాశ్వత సఫలతకు కారణభూతములగు సమ్యగాలోచనల, శాంతియుత సదాశయముల సంలగ్న స్వాంతుడయి, సంతుష్టాంతరంగుడయి సంచరించుచుండును.

"ఒక సిద్ధాంతమును బాగుగా పరీక్షించుము; ఆ సిద్ధాంతములోని సుగుణములను గమనించుము. దానిని ఆచరణలో బెట్టుము; అపుడయ్యది అఖండ విజయమును గూర్చును."

"సంపూర్ణముగ మంచిదికాని మూలసూత్రము మూలసూత్ర మనిపించుకొనదు."

"మూలసూత్రము పరిపూర్ణత్వమును ప్రకటించును."

— గాంధీజీ

# ౧. కర్తవ్యము

'కర్తవ్యము' అత్యంత వ్యాప్తియందున్న శబ్దము. కాని కష్టపడి అన్వేషించువాని కిందు అనేక అమూల్యరత్నములు లభింపగలవు. మానవుడు స్వకార్యమందు దృఢచిత్తుడయి, నిమగ్నుడయి యుండుటయు, అదియే వశమున ఇతరుల కార్యములకు చిక్కులను, ఆటంకములను గల్పింపకుండుటయే కర్తవ్య సిద్ధాంతమున కర్థము. అన్యుల కార్యములయందు వ్యర్థముగ జోక్యము కలుగజేసికొని పరోపదేశమందు పండితుడయినవాడు తన పనిని తాను చక్కగ నిర్వర్తించుకొనజాలడు. మానవుడు తన ప్రస్తుత కార్యమును చక్కగ ఆకళించుకొని నిశ్చల ధ్యానముతో, ఏకాగ్రచిత్తముతో, ఏదేక నిష్ఠతో గావించుటకే కర్తవ్యమని పేరు. కర్తవ్యమునందు సంపూర్ణత్వము, యాథార్థ్యము, శ్రేష్ఠత్వము నిండి నిబిడీకృతమైయున్నవి. మానవుల కర్తవ్యములు వివిధములు. అన్యుల కర్తవ్యమెద్దియో తెలుసుకొనుటకంటె తన కర్తవ్యమేదియో తెలుసుకొనుట ప్రతి మానవుని పరమ ధర్మము

కార్య గతులలో భేదముండవచ్చును గాని సిద్ధాంతములో భేదముండజాలదు. అది సార్వకాలికము. సార్వజనీనము. సార్వదేశికము. కర్తవ్యమును సంపూర్ణముగ, సమగ్రముగ ఎవరు పాలించెను?

"కర్తవ్యములో మాధుర్యమున్నది."

— గాంధీజీ

"సత్యసంధుడు, కర్తవ్య పరాయణుడు నగు వ్యక్తి యొక్క మార్గమును ఎవరును అర్కజాలరు."

—రవీంద్రనాథ టాగూర్.

"నీవు కర్తవ్యమును నిర్వర్తించుము. ఫలితము దైవమునకు విడిచి పెట్టుము. ఇదియే ఉత్తమ మార్గము."

—లాంగ్ ఫెలో.

## ౨. నిజాయితీ

'నిజాయితీ' రెండవ సిద్ధాంతము. ఎవరిని వంచింపరాదు. నీ హక్కును మించి ప్రతిఫలమున కాసపడరాదు. దీనినే నిజాయితీ యందురు. ఇందు కల్లకపటములకు తావులేదు. వాక్కుచేగాని, దృష్టిచేగాని, సంకేతముచేగాని కపట నాటక మూటను నిజాయితీ సహింపనేరదు. త్రికరణ శుద్ధియే దీని లక్షణము. అనినదానికి, అనుకొనిన అర్థము గ్రహించుటయు, అనుకొనిన అర్థమునకు తూచినట్లు అనువగు మాట ననుటయు అను రెండును ఈ నిజాయితీ అనుమాటలో నున్నవి. ముఖస్తుతిగాని, అధిక ప్రశంసనుగాని నిజాయితీ సహింపదు. నిజాయితీ నిజమగు సత్కీర్తికి మొదటిదారి

సత్కీర్తివలన సదుద్యమములు సంపన్నములగును. ఈ రీతిగ ప్రవర్తించుటలో నిజాయితీని విడనాడకుండుటచే విజయసిద్ధి కలుగుట నిస్సందేహము. తన్మూలమున మనుజునకు సుఖము, శాంతి, సంతోషములు కలుగగలవు. నిజాయితీని నిర్దుష్టముగ పాలించిన వ్యక్తి కలడా?

"నీవు నీపట్ల, లోకముపట్ల నిజాయితీ పరుడవుగ నుండుము."

"మన జీవితములో నిజాయితీయున్నచో దాని ప్రభావము దానంతటదే ఇతరులపయి ప్రసరించును."

— గాంధీజీ.

"సత్యము, విశ్వాసము అక్కచెల్లెండ్రు."

— ఇమర్సన్.

"సత్యసంధత సర్వశ్రేష్ఠమగు నీతి."

— సర్వెంటిస్.

నిజాయితీపరుడు పరమేశ్వరుని పరమోత్కృష్టమగు సృష్టి."

— పోప్.

## 3. మితవ్యయము

'మితవ్యయము' మూడవ సిద్ధాంతము. తన విత్తమును సంరక్షించుకొను వ్యక్తి మితవ్యయశీలు డనబరగుచున్నాడు. అతడే మితవ్యయ సంప్రాప్తమగు సౌభాగ్యమునకు అర్హుడు. ధనమును మితముగ వాడుటనే మితవ్యయమనరు. శరీర బలము, మనోబలములను మితముగ వ్యయముచేయుటయే మితవ్యయలక్షణము. ఇంద్రియ లోలత్వమును విసర్జించుట,

ఇంద్రియ నిగ్రహము నలవరచుకొనుట, శక్తిని అతి వ్యయమునకు గురికానీయకుండుట మితవ్యయమునకు ప్రధాన లక్షణములు. మితవ్యయపాలనముచే శక్తి, సహిష్ణుత, అప్రమత్తత, లక్ష్యసిద్ధికి వలయు సామర్థ్యము నిరాయాసముగ సిద్ధింపగలవు. ఈ సిద్ధాంతమును తు.చ. తప్పకుండ అనుష్ఠించువానికి మహత్తరశక్తి చేకూరగలదు. మితవ్యయముయొక్క మహత్తర శక్తిని గ్రహించినవారెందరున్నారు?

"అతి సర్వత్ర వర్జయేత్"

## ౪. ఔదర్యము

'ఔదర్యము' నాల్గవ సిద్ధాంతము. మితవ్యయమునకు బిదపవచ్చునది ఔదర్యము. ఈ రెండు పరస్పర విరుద్ధములు గావు, ఇవి పరస్పర సంబంధ బద్ధములు. మితవ్యయశీలుడే ఉదారుడు కాగలడు. దుర్వ్యయపరుడు దుర్వ్యసనలోలుడలు తన అర్థబలమును, శరీర మనశ్శక్తులను సాంతముగ గోల్పోవుచున్నాడు. అందుచే నతడు దేనికి కొరగానివాడయి, ఎవరికి అక్కరకురానివాడగుచున్నాడు. పరులకేదేని సాయమొనరింప అట్టివాని కొద్ద మిగులున దేముండును? విత్తమును దానమొనరించినంత మాత్రమున ఔదర్యముయొక్క సామాన్య లక్షణము మాత్రమే. ఉత్తమ మానవుడు సదాశయములను, సత్కార్యములను, సహానుభూతిని, సహృదయతను పరులకు దానప్రాయమున నొసంగదగును. అన్యుల శుభచింతన చేయనగును. ద్వేషులను, అహితులను సయితము ఔదార్యముచే తన దయకు పాత్రులుగ చేసుకొనవచ్చును.

ఔదార్యమొక స్వయంసిద్ధ సత్సంప్రదాయము. దీని ప్రభావము మహోదారము; దూరదృష్టి సమన్వితము. ఔదార్యము వలన ప్రియమిత్రులు లభింతురు. ఆపదలందు తోడునీడయి నిలుచు చెలికాండ్రు సంప్రాప్తమగుదురు. ఇది ఏకాకులను సహచర సంపన్నులుగను, హతోత్సాహులను నిత్యోల్లాస సంభరిత చిత్తులుగను జేయగలమేటి సంపద. ఔదార్యమును సర్వతోముఖముగ అనుష్ఠించినవాడు కలడా?

"మానవుడు తన సదాశయములను, సద్భావములను అన్యులకోసం గుట ద్వారమున సంఘసేవ చేయగలుగుచున్నాడు. సలహాల వలనను సేవ చేయవచ్చును. సత్సంకల్పము, సదాశయములే సేవకు ప్రతిరూపములు. సత్సంకల్ప సదుద్దేశ్యములు మహత్తర కార్యసిద్ధికి మూలమంత్రములు."

— గాంధీజీ

"ద్రవ్యము లేకపోవుటచే ఇతరుల కేమియు ఈయజాలకున్నను, వారి చెవిలో నాలుగు మంచిమాటలు వేయగలిగి యుందువు లేక హితోపదేశమైన చేయగలిగియుందువు. అదియు చేయజాలవా? అందులకుకూడ ద్రవ్యము కావలసియుండునా?

— శ్రీ వివేకానందస్వామి.

## ౫. ఇంద్రియ నిగ్రహము

'ఇంద్రియ నిగ్రహము' ఈ అయిదు సిద్ధాంతములలో కడపటిది. కాని ఇది అయిదింట సర్వశ్రేష్ఠము, నిరంతర చింతనీయము. మఱి ఆచరణీయము. దీని నుపేక్షించుటచే విపత్పరంపరలు వాటిల్లును. పరాజయము లనంతముగ పైబడును. ఆర్థిక నష్టము లనేకములు వెంటాడును. వీనికితోడు ఇంద్రియ నిగ్రహములేమి శరీర, మనోబల సంపదలు అపారముగ

క్షీణించును. జీవనరంగమున విజయసిద్ధికి మనోబలము ముఖ్య సాధనము. మనోబలము నశింప శరీరబలము క్షీణించును. ఇట్టి బలములేని వ్యాపారి చీటికి మాటికి విసుగుచే, ఓరిమి లేమిచే తనకడకు వచ్చు క్రయదారులను అసంతుష్టు గావించుకొనగలడు. దాని పరముగ వ్యాపార నష్టమునకు గురియగుచున్నాడు. సమస్త జనులు ఇంద్రియ నిగ్రహము యొక్క ప్రాథమిక నియమముల బాటింతురేని క్రోధము తన దందహ్యమాన విధ్వంసక స్వభావమును కోల్పోవుటయే గాక అది మటుమాయమయి పోవును. క్రోధ విదూరులయిన మానవులు ఇంద్రియనిగ్రహ మూల నియమములకు సంబంధించిన ధైర్యము, దయ, శుభము, వినయము, ద్రఢిమల క్రమముగ నభ్యసింప గడంగుదురు. కాని వారు వీనిని చక్కగ, శాస్త్రీయముగ, సంపూర్ణముగ నభ్యసింపనంత వరకు వారి చరిత్రము, కార్యసిద్ధి సందేహాస్పదములు. ఇంద్రియ నిగ్రహానుష్ఠానమునందు సమర్థులగు పురుషులు దుర్లభులు. ఇంద్రియ నిగ్రహశక్తి సంపన్నుడే సిద్ధ పురుషుడనబరగును.

“వశపడిన మనస్సు అమూల్య నిధానము, చింతామణి. మన వాంఛలన్నింటిని అది తీర్చగలదు.”

— శ్రీ రామకృష్ణ పరమహంస.

“మనము ప్రయత్నపూర్వకముగా అలవరచుకొనవలసినది ఇంద్రియ నిగ్రహము అనగా కామక్రోధాదులకు వశము గాకుండుట. ఇంద్రియములను విషయములవైపు పోనీయక నిగ్రహించి స్వవశ మొనర్చుకొనుటయే పారమార్థిక సాధనయందలి ప్రధానాశయము”.

— శ్రీ వివేకానందస్వామి.

ఈ సిద్ధాంతములైదును సుఖశాంతులకు, సఫలతా సౌభాగ్యములకు అయిదు సాధన మార్గములు. ఇవే జ్ఞాన మహానదముయొక్క అయిదు స్రవంతులు. ఈ ప్రపంచములో సాధనమువలన సాధ్యముగాని కార్యములేదు. 'సాధనమున పనులు సమకూరు ధరలోన' అను వేమనయోగి సూక్తి రత్నము సర్వజనసమాదరణీయము. నిత్యానుభవైక వేద్యము. అట్లగుట ఈ అయిదు సిద్ధాంతములలో నిండి నిబిడీకృతమైయున్న జ్ఞానమును పొందగోరువారు ఈ సిద్ధాంతములను చిలుకపలుకులవలె నూరక వల్లించుచు ఆచరణశూన్యులై యుండునంతవరకు ప్రయోజనము శూన్యము. వీనిని చక్కగ హృదయంగమము గావించుకొనదగును. అట్లు గావించుకొని మనోఫలకముపయి శిలాక్షరములవలె చిత్రించుకొనదగును. అట్లు చిత్రించుకొని అనుష్ఠించుట పరమావశ్యకము. ప్రపంచమందలి సమస్త సుఖశాంతులకు, సఫలతా సౌభాగ్యములకు ఇవియే ముఖ్య సాధనములు మఱి మానవ జన్మ తారకములు. ప్రతి కర్మవీరుడు స్వాభివృద్ధికితోడు లోక సంగ్రహార్థము కృషి సలుపుట విధ్యుక్త ధర్మముగ భావింపదగును. ప్రతివ్యక్తి ఈ సత్సిద్ధాంతముల జగద్వ్యాపకము లొనరింపబూనుట పరమవిధి. అపుడే దేశ ముద్ధరింపబడును.

తే॥ ప్రాణిలోకంబు సంసార, పతిత మగుట
వసుధపైఁ గిట్టిపుట్టని, వారు గలరె
వాని జన్మంబు సఫల మై, వ్వాని వలన
వంశ మధికోన్నతి వహించి, వన్నె కెక్కు.

— భర్తృహరి.

# ఉత్తమ నియమములు

పూర్వోక్తములగు అయిదు సిద్ధాంతములు పూ
ముగ అర్థమయి, అభ్యస్తములయినంతనే వానినుండి సుధ
మములగు నియమము లావిర్భవించుచున్నవి. నియమ
కార్యములవలన సత్సిద్ధాంతము లుదయించుచున్నవి. మా
జాతికి చట్టమునకు గల సంబంధమే ప్రాణికిని నియమమ
కును మధ్యకలదు. ఈ సృష్టియందు సర్వత్రగాననగు వే
వేలు ఖండములు, దేశములు, పరస్పర సంబంధము. ఐక్య
గలిగి యున్నవి. వైవిధ్యములో ఏకత్వము, ఏకత్వము
వైవిధ్యము సృష్టిస్వభావము. ఈ వైవిధ్యమువలననే, ఈ
స్పరైక్యతవలననే మన కీ విశాలవిశ్వము సువ్యవస్థితము
సుందరముగ, మనోహరముగ గనబడుచున్నది. ఈ రీతిగ
సత్యాసత్యజీవితముల ప్రయోజనా ప్రయోజనములు, బ
బలములు, జయాపజయములు, సుఖదుఃఖములు, జీవిత
యొక్క సాఫల్యవైఫల్యములు నియమముమీాదనే ఆధారప
యున్నవి. అసత్య జీవితమునందు ఆలోచనలు, ఆశయము
కలగూరగంపవలె నుండును. సత్య జీవితమందు సమస్తాలో
నలు, సమస్త కార్యకలాపములు సువ్యవస్థితములయి, సుప
ష్కృతములయి, నియమబద్ధములయి తీర్చిదిద్దినట్లుండును. శి
లములయి, తుత్తునియలయి మాఁయుమూల ప్రదేశములో క్రా
గానివయి పడియుండు యంత్రభాగములకును, అదే యంత్ర

ములో చక్కగ పనిచేయుచుండు యంత్రభాగములకును గల వ్యత్యాసమే అసత్య జీవితమునకును సత్యజీవితమునకును గలదు. చక్కగ, సక్రమముగ పనిచేయు యంత్రము లాభదాయకమే గాదు ప్రశంసాపాత్రముగ, మనోహరముగ, సర్వాంగసుందరముగ నుండును. కాని యా యంత్ర భాగములే ముక్కచెక్కలయి దేనికిని పనికిరానివయినపుడు వాని యందచందములు అదృశ్యములయిపోవ, అపుడవి పెంటకుప్పపయి పారవేయబడును. సరిగా ఇదియే చందమున ఏ వ్యక్తి జీవితము తన అన్ని రంగములందు సంపూర్ణముగ నియమబద్ధము, క్రమబద్ధము నయి సర్వశ్రేష్ఠమును, సర్వోన్నతమును, సర్వతోముఖమునునగు సామర్థ్యమును సముపార్జించుకొనగల కౌశలము గలదయియుండునో ఆ వ్యక్తి జీవితము శక్తిమంతమే గాక ఉత్తమము, ఉన్నతము, సుందరము నయి ప్రకాశింపగలదు. తద్భిన్నముగ ఏవ్యక్తి జీవితము అవ్యవస్థితమయి, అనియమితమయి, అయోగ్యమయి అసత్యమయమయియుండునో ఆ వ్యక్తి జీవితము అసమర్థమును, అసమంజసమును నయి దయనీయ స్థితికి ప్రాపింపగలదు.

మనము నిష్కళంక జీవితము గడుప నభిలషింతుమేని నిశ్చయము నియమముల నవశ్యము పాటింపవలయును. నియమపాలనమున అనుక్షణము అప్రమత్తులమయి యుండవలెను. చిత్ర విచిత్ర మహాద్భుత నానావిధ వస్తు సందోహ సంశోభితమయి యొప్పు నీ సృష్టి కార్యకలాపములన్నియు ఒక నియమము, ఒక క్రమము, ఒక న్యాయము, ఒక ధర్మము ననుసరించి జరుగుచున్నవి. మనమును ఆ సృష్టిలోని వారమే

గదా! అట్టిచో మనమేల దాని ననుసరింపరాదు? బుద్ధిశాలికి ని మూర్ఖునకును జీవిత విధానములో, దినచర్యలో హాస్తిమశ కాంతరముండును. బుద్ధిశాలి లోకముచే సామాన్యముగ నెంచబడు స్వల్పవిషయము లయిన సంగతము ధ్యానముంచును. మూర్ఖుడు వానినిగూర్చి విచారింపకయే వానిని త్రోసిపుచ్చు చుండును. సమస్త వస్తువుల- అవి చిన్నవయినను పెద్దవయి నను వానికనువగు యథోచిత స్థానములలో యథా సమయము లలో నుంచుట వివేకలక్షణము. నియమోల్లంఘనము అవ్య వస్థతకును, భిన్నమార్గమునకును దారితీయును. అది దుఃఖము నకు పర్యాయపదమనినను అందతిశయోక్తి లేదు.

కుశాగ్రబుద్ధియగు ఉద్యమశీలుడు నియమముల ననుస రించుటచే జీవయాత్రయందు సఫలుడగుచున్నాడు. నియమ రహిత జీవయాత్రలో ఎంతటి బుద్ధికుశలుడేని విఫలుడు కాక తప్పదు. సంయమ నియమములతో గూడిన ఆచార వ్యవహార ములు సుఖప్రదములు; తద్వ్యతిరేకములు దుఃఖప్రదములు అను సంగతి వివేకి గుర్తింపగలడు. ఏకాగ్రచిత్తముతో ఆలో చింపనివాడు, కార్యాచరణమున త్వరపడువాడు, సంయమ రహితము, నియమ విరుద్ధము, స్వేచ్ఛాచార పరతంత్రము, నగు విలాసమయ జీవితము గడుపువాడు మూర్ఖుడు. ప్రతిది సావధాన చిత్తముతో ఆలోచించువాడు, ధీరోదాత్తుడు, ఉత్తమ లక్ష్య ప్రేరితుడు, ప్రయత్న పూర్వకముగ కార్య మాచరించువాడు వివేకి.

భౌతిక వస్తువులను, జీవిత బాహ్యావేషములను ఆడం బరముగ అలంకరించుకొనుట మాత్రమే నిజమగు నియమ

లక్షణముగాదు. బాహ్యాలంకరణము కేవలము నియమ ప్రారంభ మనదగును. మనస్సును క్రమబద్ధ మొనరించుట యందును నియమ ప్రయోజనము మిక్కిలి ఉపకరించు చున్నది. ఇంద్రియముల వశీభూత మొనరించుకొనుటలో నియమము సహకారి. మాటల తూచి, ఆచి, వివేచించి మాట్లాడుటకును, ఆలోచనల హేతుబద్ధములుగ వ్యవస్థీకరించు కొనుటకును, సముచితములగు సత్కార్యములనెన్ను కొనుట కును ఈ నియమమే ఉపయోగపడగలదు.

సముచిత నియమముల చక్కగ పాటించి ప్రశస్తము, సఫలము, సుందరము, మధురము, మనోజ్ఞమునగు జీవితము గడుపగోరు వ్యక్తి నిత్యజీవిత కార్యకలాపముల స్వల్ప విషయము లందేమి నియమ పాలనముపట్ల ఏమరి యుండరాదు. వానిని పొరపాటునగూడ పరిత్యజింపరాదు. ఉదాహరణకు; ప్రాతఃకాలము మేల్కాంచు సమయము నిర్ణీతమై యుండవల యును. ఈ రీతిగనే రాత్రివేళ నిద్రపోవుటకును ఒక నిశ్చిత సమయమును నిర్ణయించుకొనదగును. నిద్రించవలసిన గడియ లెన్నో నిర్ణీతము, నియమబద్ధము గావించుకొనదగును. స్థూల దృష్టికి ఇవి సామాన్యములుగ గోచరించును. కాని ఇవియే మన సుఖసౌభాగ్యములకును, ఆయురారోగ్యములకునుమూల కందములను విషయము జ్ఞాపకముంచుకొనుము. ఈ విష యమునుగూర్చి ఒక మహానుభావుడు ఎంత చక్కగ వివరించి యున్నాడో గమనింపుడు: "రాత్రి మొదటి జాముననే నిద్రించి వేకువననే మేల్కాంచు వ్యక్తియొక్క బుద్ధి, స్వాస్థ్యము సంపదలు నిత్యము దినదినాభివృద్ధి నొందుచుండగలవు. వాని

వృద్ధివలన శరీరము తేజస్వంతము, ఓజస్వంతము, కాంతిమంతము నగును. ప్రాతఃకాలమందలి మలయమందమారుతము వాని హృదయ కమలమును వికసింపజేయును. రాత్రి మొదటి జామునసే నిద్రించి వేకువననే మేల్కాంచువారు సౌఖ్యవంతులు, సుఖ సౌభాగ్యసంపన్నులు నగుదురు."

ఆహార పద్ధతి ననుసరించియు, వేళకు భుజించుటను బట్టియుచిత్తము ప్రసన్నమగును. హృదయమాహ్లాదమందును, మన జీవితమున సంఘటించు మంచి చెడ్డలన్నియు మన యీ యాహారపద్ధతి, సమయములమీద నే ఆధారపడియున్నవి. వీని ననుసరించియే మానవుని శారీరక, మానసిక క్రియలలో మహత్తర పరిణామములు, పరివర్తనములు కలుగుచుండును. జగడము, జంజాటములు లేకుండ తన నిత్య కార్యకలాపముల ప్రశాంతముగ నిర్వర్తించుకొన నభిలషించు వ్యక్తి, సుఖమయము, ప్రభావోపేతము, ప్రయోజనకరము, సుఖసంపన్నమునగు జీవితమును గడుపగోరు వ్యక్తి తనకు గల సమయమును ఏయే విషయములకెంతవినియోగించుట సముచితమో కాలవ్యయ పట్టికను సిద్ధపఱచుకొను టత్యంత వాంఛనీయము. తనకు గల సమయములో కొంత పనిపాటలకును, కొంత మనోరంజనమునకును, కొంత ఏకాంతమున ప్రశాంతముగ జీవిత సమస్యలగూర్చి ఆలోచించుకొనుటకును విభజించుకొను టత్యంత వాంఛనీయము.

ఇదియంతయు బాహ్యాంతర సంపూర్ణ జీవితములో సర్వత్ర వ్యాప్తమయియున్న ఒక మహానియమముయొక్క ప్రారంభము మాత్రమే. ఈ నియమముల సమముగ బాలిం

చుట వలన ఆలోచనలలో, మాటలలో, చేతలలో, అభిలాష లలో పరస్పర ప్రాతికూల్య మంతరించి సమత్వము సమకూ రును. అపుడు అవివేక మంతరించును. వివేక ముదయించును. దుర్బలత్వము దూరమయి సబలత్వము సంప్రాప్తమగును. మానవుడు తన మనస్సు నీరీతి నియమబద్ధము గావించుకొని నంతనే ఆతని సమస్త వృత్తులు పరస్పర సమైక్యము జెంద గలవు. అపుడాతని వివేకము, యోగ్యత, సుఖశాంతులు పరాకాష్ఠ నందుకొనగలవు.

కాని యిది కట్టకడపటి స్థితి. అంతిమస్థితి నందగోరు వ్యక్తి ఆదినుండియే ఆరంభింపవలెను. స్వీయమనోరథ సిద్ధి కొఱకు జీవనపథమున క్రమముగ పురోగమించుచుండవలెను. తన జీవితమందలి ప్రతి విషయమును, వ్యవహారమును, కార్య మును నియమబద్ధముగ, న్యాయసంగతముగ రూపొందించు కొనుచుండవలయును. ఇట్లాచరించుచు ఆతడు తన లక్ష్య మును సమీపించుకొలదియు ఆతనికి శక్తి, సామర్థ్యము, సంతోషములు సంప్రాప్తమగును.

మనుజుని శక్తికి, సామర్థ్యమునకు సహకారిణియగు సమత్వము నియమపాలనముననే సిద్ధించుననుటయే దీనిసారాం శము. మనస్సును నియమితముగ నుంచుటయే సంయమము. దీనివలన బలవృద్ధి, సుఖసమృద్ధితోగూడిన చిరశాంతి చిత్త మునకు సంప్రాప్తమగును. నియమము ననుసరించి పనిచేయు పద్ధతికి, నియమము ననుసరించి పరిగ్రహించు ఆచార వ్యవ

హారములకే సంయమమని పేరు. మన కార్యపద్ధతులు, ఆచార విచారములు భిన్నములు గావు. అవి చరిత్రము, జీవితము యొక్క రెండు స్వరూపములు.

కాబట్టి నియమానుసారము కార్యమాచరించుము. సత్యము వచింపుము. హేతుబద్ధముగ ఆలోచించుము. జయమునకు అపజయమునకు, కోకిల స్వరమునకు కాకిస్వరమునకు, సుఖమునకు దుఃఖమునకు మధ్యగల భేదమే నియమమునకు అనియమమునకు, వ్యవస్థకు అవ్యవస్థకు, సత్యమునకు అసత్యమునకు మధ్య గలదు.

శ్రమించుటలో, కృషి సలుపుటలో, ఆలోచించుటలో నేయేల ఉత్తమ జీవనయాత్రలో సంపూర్ణ స్వాస్థ్యప్రాప్తి, సంపూర్ణ సఫలత, నిశ్చల మనశ్శాంతి బడయుటకు ఉత్తమ నియమపాలనమే అన్నిటికంటె స్థిరము, నిర్వివాదము నగు మూలాధారము.

యుక్తియుక్తములగు నియమములచే నిర్మింపబడని జీవితసౌధముయొక్క పునాది స్థిరముగ నుండజాలదు. అది బాహ్యమునకు బాగుగ కన్పించినను అది భయసందేహముల కాస్పదమే యగును. అది యొకనాడు కుప్పగ నేలపయి కూలిపోయినపుడు దానినిజూచి వగచిన గలుగు ప్రయోజనమేమి?

"నియమబద్ధముగా నీ జీవితమును నడుపుము. వాణిని, జిహ్వను, భోజన నియమమును, నిద్ర మొదలగునవి అన్ని నియమములను పాలించుము."

— శ్రీ పండిత్ మదనమోహన మాలవ్య

# సత్కర్మలు

సముచితములగు సిద్ధాంతములను దెలుసుకొని, నియమములను నిర్ణయించుకొనిన పిమ్మట నే కర్మాచరణ ప్రారంభమగును. సముచిత సిద్ధాంతములను అవగతము చేసుకొని, సముచిత నియమముల ననుసరించి కర్మ చేయగోరువాడు చిన్ని చిన్ని పనులు సయితము ఉపేక్షింపదగినవి కావని తెలుసుకొనగలడు. ఆ కార్యములు వానివాని ప్రకృతినిబట్టి క్రొంగ్రొత్త రూపములను, క్రొంగ్రొత్త వెలుగులను సంతరించుకొను చుండును. నిత్యములు గాక నైమిత్తికములయిన కర్మల స్వభావమువలనను, వాటి శక్తిసామర్థ్యముల పరిజ్ఞానమువలననుకూడ అంతఃకరణమునందు ఒక క్రొత్తచూపు కలిగి, ఒక క్రొత్తవెలుగు వెలిగి నిత్య నవీన స్ఫూర్తి కలుగుచుండును. మనుజుడు అంతర్దృష్టిని ప్రాపింప జేసుకొనుకొలది ఔన్నత్యము నందుచుండును. దీనివలన అతని జీవనపథము సుస్థిరమగును. అతని జీవితమందలి ప్రతిది పవిత్రము, ప్రశాంతము నగుచుండును. అతడు తనకు నలుదెసల సుస్థిరముగ పాదుకొనియున్న బాహ్యశక్తులనుండి తప్పుకొని సమస్త విషయములందును భద్రము, నిర్బాధకమునగు ప్రశస్త సుగమ పథమున పయనించుచుండును. ఇట్టి మనుష్యుడు తన ఇరుగు పొరుగువారి యోగక్షేమములను గుఱించియు, సుఖశాంతులను గుఱించియు లక్ష్యముసేయునా యను సందేహము కలుగవచ్చును. ఇది ఆలోచనీయాంశమే. కాని ఇట్టి వ్యక్తి

పొరుగువారి అభిప్రాయములతో, వారికిగల అజ్ఞానముతో, అనివార్య విషయములతో నెట్టి సంబంధమును గలిగియుండ నిచ్చగింపడు. పరోపకారము, పరజనకళ్యాణ నిరతియే సత్కర్మల లక్ష్యము. సత్కర్మలు తన పొరుగువారి సుఖసంపదల కేర్పడినవను సత్యమును పరోపకారపరాయణు డెన్నడును మరువజాలడు. అట్లగుట అతడు ఎల్లప్పుడు అట్టికార్యముల నే గావించుచుండును. అతని సన్నిహితులెవరేని అతనిని అట్టి సత్కార్యములనుండి మరల్ప ప్రయత్నించినను, పొరుగువారి సుఖసౌభాగ్యముల కాటంకముల గల్పింప ప్రబోధించినను వానిని సరకుగొనడు.

మిథ్యాకర్మల బరిత్యజించి సత్కర్మల పరిగ్రహింప గోరువారు ఈ రెంటికి గల తారతమ్యమును సులభముగ అవగాహన చేసుకొనగలరు. మనము భౌతిక ప్రపంచములోని వివిధవస్తువులను వాని రూపము, వర్ణము, ఆకారాదులబట్టి గుర్తించి వానిలో మన కుపయోగపడు ఆవశ్యక వస్తువుల నెన్నుకొని పనికిమాలిన వస్తువుల విడిచి పుచ్చుచుందుము. అదియే చందమున కర్మల స్వీయ జగత్తులోకూడ మనము మంచిచెడ్డలను వాని స్వభావము, ఉద్దేశము, ప్రభావములను బట్టి వాని గుణదోషముల పరిశీలింపగలము. కాబట్టి మనము మంచివానిని స్వీకరించి చెడ్డవానిని త్యజింపనగును.

మంచిని స్వీకరించుటకును, జ్ఞానమును సముపార్జించుటకును, దోషపరిత్యాగమే (చెడును పరిత్యజించుట) మార్గదర్శకముగ నుండును. అట్లగుట ముందు చెడును పరిత్యజించుట అవశ్యాచరణీయము. అపుడే మనము అన్ని విధముల

అభివృద్ధి నందగలము. చదువుటలో దొరలు దొసగుల నెత్తిచూపినపుడే విద్యార్థి తన తప్పుల దిద్దుకొని సక్రమముగ పాఠముల నేర్చుకొనగలడు. ఉచితమేదో, అనుచితమేదో తెలియజాలని మనుజుడు అనుచిత కార్యమును ఎట్లు పరిత్యజించనగునో గ్రహించుటెట్లు? అతడు అనుచితమును గ్రహించనట్లు ఉచితకార్యమేదో, దాని నభ్యసించుటెట్లో తెలియ నశక్తుడు. పరుల శ్రేయస్సుతో నిమిత్తములేక స్వసుఖములకే ఉద్దేశింప బడిన కర్మలన్నియు దుష్కర్మలుగనే పరిగణింపబడును. పరాధీన చిత్తమునుండి, నియమ విరుద్ధములగు వాంఛలనుండి ఉదయించు కర్మలును దుష్కర్మలే. మనుజుడు చేయు ఏ పనినైనను రహస్యముగ నుంచ గోరిన అదియు దుష్కర్మయే యగును. అన్యుల దృష్టి యందుంచుకొని వారి శ్రేయస్సును సయితము మరువక చేయబడునవియే సత్కర్మలు. సాంఘిక సిద్ధాంతములచే పునీతములయి, ప్రశాంత తర్కవాద పరిష్కృతములయి సమతా భావముల నుండి ఉదయించు కార్యములే సత్కర్మలు. పట్టపగటివేళ పదుగురి యెదుట చేయు పనులకు కర్త సిగ్గిలడేని అవియు సత్కర్మలె.

సత్కర్మ నాచరించు మనుష్యుడు స్వీయానంద లబ్ధికి గాని, స్వకీయాభీష్టసిద్ధికిగాని అన్యుల చిత్తములకు విషాదమును, ఆవేదనమును, క్లేశమును గలిగించు ఎట్టి చిన్న పనులనేని చేయనొల్లడు. ఇట్టి పరజన విషాద కారణభూతములగు చేతలను పరిత్యజించుటతో తన కార్యము నారంభించును. సత్కర్మ నిరతుడగు మనుష్యుడు మొదట స్వార్థమును బలి

నెట్టి, అసత్యమును పూర్ణముగ పరిత్యజించి, నిస్స్వార్థము, సత్యముల జ్ఞాన సముపార్జనమున కుత్సహించును. అతడు రాగ ద్వేషములకు, కామ|క్రోధములకు మఱచియైన వశంవదుడయి పరుషభాషణము సేయడు. క్రూరకర్మల నాచరింపడు. మనస్సును జయించుట నభ్యసించును. కార్యారంభమునకు దొలుతనే అతడు ప్రాణ సంహారకమగు విషపానముకంటె భయంకరమగు కపట నాటకమునకు తలయొగ్గడు. కుతంత్రములు, కుటిలనీతులకు స్వాగతము బలుకడు. స్వార్థోన్మత్తములగు కార్యముల దెసకుకన్నెత్తియైనచూడడు. అపహాస్యమునకు తన్ను గురిచేయునట్టి ఏ పనికిని నుంకింపడు. పదుగురిలో తలవంపునకు తన్ను పాత్రుని జేయు ఏ పనికి నిచ్ఛగింపడు. గురుజనులు వినరానివియు, కనరానివియు, తన్ను నలుగురినోట బడజేయునట్టియు కర్మలు దుష్కర్మలు. బహిరంగముగ ఆచరింపజాలనట్టియు, గుప్తముగ నుంచదగినట్టియు, పెద్దల సమక్షమున నోట నుడువ సిగ్గిలజేయునట్టియు పనులన్నియు దుష్కర్మలు. సత్పురుషుడు ఇంట, బయట ఇట్టి దుష్కర్మ పరిత్యాగమునకయి సదా పాటుపడుచుండును. దుష్కర్మల బరిత్యజించుటయందు జాగు చేయరాదు. వేగిరపడుట కడు లెస్స.

ఈ చందమున దా నాచరించు కార్యములందు సత్యమున కుత్తమ స్థానము నొసంగి నిష్కపటముగ ప్రవర్తించు మనుజుడు ఆలోచనాపరుడగుచున్నాడు. అట్టితడె అతడుపరుల మాయావాగురములో దగుల్కొనుటకు దెన్నుజూపు ఎట్టి కర్మల నాచరింపడు. అపరిచితులతోటి ప్రథమ సమాగమము

లోనే వారి తేనె తీపి పలుకులకు వశీభూతుడయి, వివేకమును గోల్పోయి ఎట్టి క్షుద్రకార్యములకు గడంగడు. దీర్ఘాలోచనచే వారి మాటలయందలి భావమును, లోతుపాతులను గుర్తెఱుంగ బ్రయత్నించును. సత్కార్యాచరణపరాయణుడు ఆలోచనాపరుడు కాకుండుట మహాపరాధము. జగతీతలమున మొదటినుండియు యుక్తాయుక్త విచారణ, సద సద్విమర్శ, పరామర్శ చేయని మనుజు లనేకులు తమ చేతలనెంత సక్రమముగ, సదుద్దేశ్యముతో కట్టుబెట్టులతో గావించినను దుష్పరిణామముల నే బడయుచున్నారు. "చక్కగా ఆలోచించి మనసను చేసిన పిమ్మట అది నరకమార్గమైనను అనుసరణీయమే యగును." సత్కార్యాచరణమున ఆలోచనాశక్తి ప్రజ్వలితమగు చున్నది. సత్కర్మలు గావించు వ్యక్తి అందఱికంటె అధికముగ ఆలోచనాపరుడగును. కనుక పామువలె చతురమతివి, కపోతమువలె నిర్దోషివి కమ్ము.

కర్మక్షేత్రము సువిశాల మయినది. ఇందు మనుజుడు గావించు చేత లనేకములు అనాలోచితములు. ఆలోచనరహితముగ గావించు తమ పనులకు అవివేకులేవో అనుకూలార్థముల గల్పించుకొనుచుందురు. ఆలోచనాపరుడు తన ఆలోచనా పటిమను నిశిత మొనరించుకొనుకొలది కర్మ స్వభావమును క్షుణ్ణముగ గ్రహించగలుగుచున్నాడు. అపుడే ఉచిత కార్యనిర్వహణశక్తి తానయి వర్ధిల్లగలదు. ఆలోచనాపరుడు మూర్ఖముగ నెట్టి పనిని చేయ సమ్మతింపడు. ఆలోచనాపరత్వమందే తప్పొప్పుల దెలుపు జ్ఞానము గర్భితమయి యున్నది.

కట్టుదిట్టముగ సత్ప్రేరణతో కార్యమాచరించుటతో మనుజుడు తనివి జెందరాదు. చేయునది సత్కర్మ. అదియు దీర్ఘముగ పూర్వాపరముల గుర్తెఱిగి చేతకు గడంగుట సమంజసము. నిరతము సుఖింపగోరు వ్యక్తి పరహితాచరణ నిమిత్తము తాను దీక్షితుడు కాదగును. అట్టివాడు సత్కర్మల జేయుటయందే సంలగ్న చిత్తుడగుట వాంఛనీయము. దూరమాలోచింపక, వివేచింపక అన్యులకు కీడు సేయువాడు తాను చేసినపని సదుద్దేశ్యముతోడనే చేసితినని చెప్పురీతి సర్వే సర్వత్ర మనము చూచుచుందుము. కాని యిది కటికికల్ల. అతడు తన కీడు తలంపును దాచిపుచ్చుటకు చెప్పు ఒక మిషమాత్రమే యిది. కావున మనుష్యుడిట్లాచరింపక తాను జీవితమందు సాధించిన పరిపక్వానుభవముచే గతమున, వర్తమానమున తాను చేసిన తప్పును సరిదిద్దుకొని భవిష్యత్తులో తానాచరింపబూను ప్రతిపనిని ఆలోచనాపూర్వకముగ ఆచరించుటకు సుశిక్షితుడు, అభ్యస్తుడు కాదగును.

సత్కర్మల కుత్పత్తిస్థానము విశుద్ధ చిత్తము. కనుక మానవుడు సత్యాసత్యముల దెలిసికొనునపుడు సయితము తన మనస్సును విశుద్ధముగను, అప్రమత్తముగను నుంచుకొనును. వివేకియగు నతడు తన స్వాంతమును అవిచలముగ, స్వస్థముగ, ప్రశస్తముగ, సుదృఢముముగ గావించుకొన గడంగును. అతడు తన జీవితమందలి ప్రతిరంగమున సత్యమును సుస్పష్టముగ బరిశీలించుటకు అంతర్దృష్టిని అలవరచుకొనును. దాని నాచరించుటకు విశ్వాసమును, విజ్ఞానమును సముపార్జింపగడంగును. అట్టి స్థితికి బ్రాపించిన మనుష్యుడు

తన చరిత్రయను సౌధమును, జీవితమను మహాప్రాసాదమును పరాజయములను ప్రచండ ప్రభంజన తాడనములకు, క్లేశ రూపములగు ప్రకృతి ప్రకోపములకు అందనంతటి ఉన్నత పర్వతోపరితలమున గట్టి పునాదులతో నిర్మించు కొంటిమేని సంతోషమున నుప్పొంగి పోగలము.



"నహి కల్యాణ కృత్కశ్చిత్ దుర్గతిం తాత గచ్ఛతి"

— భగవద్గీత

తా॥ "శుభకార్యము లొనర్చువాడు ఎన్నటికి దుర్గతి నొందడు"

"సత్కర్మ ఎన్నడును వ్యర్థము కానేరదు. శుద్ధాంతరంగము నుండి వెలువడు వాణి నిష్ఫలము కానేరదు." — గాంధీజీ



క. "అంతంతకు సత్కర్మము
లెంతయుఁ జేయుచుండ జీవు, డెక్కుడు చేయుం
జింతా కలుషము వాయగ
సంతోషామృతము నాని, సంశుద్ధుడగున్."

— మహాభారతం, శాంతి. ఆ. 5 ప. 419

ఆ.వె. "ఉత్సవంబు మీద, నుత్సవమందుచు
సుఖము మీద సుఖము, చొప్పడంగ
బుణ్యపదము మీద, బుణ్యపదంబున
కరుగు నరుడు సుకృతియైన నధిప."

— మహాభారతం, శాంతి ఆ ౬. పద్య 74

"చెడ్డ తలంపులును, చెడ్డ పనులును పెద్దపులులవలె పైకి దుముకు నని మఱువకుడు. సత్కార్యములు నూరుల కొలదిగను, వేలకొలదిగను దేవతాగణముల మహిమతో సదా మిమ్ము రక్షింపగలవను దృఢ విశ్వాసము కలిగి ప్రవర్తింతురుగాక!" — శ్రీ వివేకానందస్వామి

# సత్యభాషణము

సతతాభ్యాసము, సాధనమువనే సత్యస్వరూపమును మనము సాక్షాత్కరింప జేసుకొనగలము. సత్యమును గుర్తింప ప్రయత్నించువాడు నిష్కపటియయి యుండనగును. సంపూర్ణ నిష్కపట జీవితమునకు సత్యభాషణము నాంది. సత్యనివాసమెక్కడ? అది తన సహజసౌందర్యమునందు, సరళత్వమందు, సత్య విరుద్ధాంశముల బరిత్యజించుటయందు, సత్యమునకు భిన్నములగు చేతల గావింపకుండుటయందు, యథార్థాంశముల పరిగ్రహించి ఆచరించుటయందు నిత్య నివాస మేర్పరచుకొని యుండును. కనుక సత్యభాషణము సత్యజీవితమున ప్రప్రథమముగ ఆచరింపవలసిన విధులలో నొకటి. మనుజుడు కల్లలాడరాదు. కల్లకపటములనెల్ల త్యజించవలెను. అపవాదములకు దూరముగ నుండవలెను. వివిధములగు దుర్భాషలను కట్టిపెట్టవలెను. ఇట్లాచరింపడేని మనుజుని చిత్తసీమను ఆత్మజ్ఞానము సుంతయు కలుగ నేరదు. మిథ్యాభాషి, అపవాదుల వ్యాపింపజేయువాడు ఆపాదమస్తకము అజ్ఞానమున మునిగియుండును. అతని అజ్ఞానము అగాధము. వానియందు యుక్తాయుక్తముల జ్ఞానము శూన్యము. అట్టి జడుడు తాపలుకు బొంకులు, కీడుమాటలు జీవితమునకు ఆవశ్యకములనియు, ప్రశస్తములయినవనియు, ఇట్టివాని మూలమునవే తాను, మరి ఇతరులు సురక్షితులుగ నుండగలమను భ్రాంతికి, అపోహకు లోనగుచున్నాడు.

ఉన్నతము, ఉత్తమము నగు జీవితము నభిలషించు

విద్యార్థి తన్నుదా గుర్తెఱుంగుచు పరీక్షించుకొనవలయును. సకల చిత్తభ్రమలనుండి జాగరూకుడయి యుండవలెను. అట్టి విద్యార్థి కపటనాటకమాడు స్వభావమును గలిగియుండరాదు. ఆత్మస్తుతికి బానిసీడయి పరనిందకు గడంగరాదు. అతని వాక్కు అసత్యమునకు, అసూయాద్వేషములకు లోను గారాదు. ఆత డిట్లాచరింపడేని జీవితమునకు వలయు సర్వోన్నతములగు ప్రశస్త విషయముల నధ్యయనము గావించు ప్రక్రియలో మొదటి అడుగు వేయుటకేని నోచుకొనడు. ఆత్మవిద్యా పారంగతుడయినను, కౌతూహల ప్రేరక విద్యల జెట్టియయినను, ఆధ్యాత్మికతత్త్వ విషయముల నేర్చినవాడయినను. అద్భుతాద్భుత విషయముల యం దధ్యయనశీలుడయినను కడకు అదృశ్యాత్మలతో సంభాషించు నేర్పు కలిగియున్నను జాగ్రదావస్థవలె నిద్రావస్థయందు అదృశ్యుడయి విహరింపగల శక్తిని గలిగియున్నను, ఆత్మజ్ఞానమును సయితము పుస్తక పరిజ్ఞానమువలె కల్పనా పూర్వకముగ సంపాదించిన వాడయ్యు - కపటమును, వంచనమును, పరనిందను విసర్జింపడేని సమున్నతము, ఆదర్శప్రాయము నగు జీవితము వానికి వేయి ఆమడల దూరమున నుండును. జీవితమున సమున్నత విషయములేవి? ఇవియే సమున్నత విషయములు:- నిష్కపటము, సత్యనిరతి, నిర్దోషము, నైర్మల్యము, అనుకంప, వినయము, విశ్వసనీయత, భక్తిభావము, నిరాడంబరము, ధైర్యము, దయ, సహానుభూతి, ఆత్మార్పణము, సంతుష్టి, శుభేచ్ఛ, ప్రేమలు, వీనిని చదువనోపువాడు, నేర్వనోపువాడు ముందుగ వీని నభ్యసింపదగును. ఇదియే

సులభమార్గము. మార్గములందు మొదటి మార్గము. ఆత్మ జ్ఞానము లేనందువలననే మనుజుడు అసత్యభాషణమునకు, పరనిందకు గడంగుచున్నాడు. మృషావచనము, పరనిందలను పరిత్యజించినపుడే ఆత్మజ్ఞానలబ్ధి కలుగును. స్వార్థ ద్వేషములు, అసత్యభాషణము, పరనిందలనుండియే రూపొందుచున్నవి.

అపవాదు-పరులపయి అభాండములు వేయుట అసత్య భాషణమునకు బంధువు. ఇది కీడులలోనికెల్ల మేటికీడు. ఇది అసూయాద్వేషముల పరముగ రేకెత్తిన క్రోధముతో మిళితమయి యుండును. ఈ దుష్ట ప్రవృత్తి (అపవాదు) మిథ్యకంటె బలవత్తర మయినది. ఇది సత్యముయొక్క వేషమును ధరించి అత్యంతనిపుణముగ కలయందేని కల్లాలాడని సత్యభాషిని సయితము వశీభూతుని గావించుకొనును. ఆ సజ్జనునిచే బొంకజేయును. అపవాదు రెండు విధములు. ఒకటి : ఒకరిపయి అపనిందను గల్పించుట, దానికి చిలువలు పలువలు గూర్చుట. రెండు : ఒక వ్యక్తిపైనున్న అపవాదును మూఢముగ నమ్మి దాని ననుసరించి చరించుట. అపవాదు వినువానికంటె అపవాదునుగల్పించువాడే దుర్బలచిత్తుడు. నిరతము చెడను విన నలవడిన మనుజునియందే కటు వచనములు చోరబడి వాని చిత్తసీమను నెలకొని మొలకెత్తి పెంపొంద గలవు. ఇతరుల పయి అపవాదుల వేయు మనుజుని మాటలను నమ్మువాడు, నమ్మి తదనుకూలముగ వర్తించువాడు అపవాదుల బుట్టించు దుశ్చరిత్రునకు సముడే యగుచున్నాడు. అపవాదులు వేయువాడు, వానిని

ప్రోత్సహించువాడు ఉభయులును సమానదోషులే. పరనిందా పరాయణుడు అపవాదులను బుట్టించుటలో దిట్ట. వానిని ఆసక్తితో ఆలకించువాడు అపవాదుల పుట్టించువానికంటె దిటవుగల దిట్ట. అపవాదుల వ్యాపింపజేయుటలో ఉభయులు సమభాగులు; సహచరులు.

అపవాదు సామాన్యమగు అవగుణముగ పైకి కన్పించును. కాని యిది అత్యుగ్రము, అతి భయంకరము, అత్యంత దుష్టము నగు అవగుణము. చెడ్డమాటలు, నీలివార్తలు అజ్ఞానమునుండియే ప్రాదుర్భవించుచున్నవి. అజ్ఞానమందే అవి సునాయాసముగ వ్యాప్తి నందుచున్నవి. భ్రమ, (అపోహము) వలననే తఱచు యిది తలయెత్తుచున్నది. ఎవడేని యొకవ్యక్తి తనకు మఱొకవ్యక్తి తీరని అపచారము గావించినాడను అనుమానమునకు లోనయినపుడు అతడు రెండవవాని యెడ క్రుద్ధుడు, ఈర్ష్యాళువు నగును. వాడు నా కపచారము గావించినాడను భావము పదే పదే మదికివచ్చినంతనే రోష కషాయిత లోచనుడయి క్రోధావేశమునకు బానిసీడయి తన కెంతో తీరని క్షతి గలిగినట్లు భావించి సంక్షుభితు డగును. అంతట నతడు రెండవవాని పయి కల్పితాపరాధముల మోపి, నీలాపనిందలను సృష్టించి తన స్నేహితుల కడ కటుభాషలో వానిని గుఱించి నమ్మునట్లు చెప్ప నారంభించును. వినువారు సంక్షుభితుడగు వాని కఱకు పలుకుల నాలించి విశ్వసించి వాని యెడ సహానుభూతిచే ఆర్ద్రచిత్తు లగుదురు. అట్టి స్నేహితులు అకారణముగ రెండవ వానిపయి వేయబడిన అభాండములను వాని వాఙ్మాలముతో

నిమిత్తము లేకయే సమస్తమునమ్మి రెండవ వ్యక్తియెడ కక్షుబూని అత్యంత కఠినముగ ప్రవర్తింతురు. వారంతటితో నూరుకొనక ఆవ్యక్తిపై సంఘమున దుష్ప్రచారము గావించి వాని పయి దుమారము రేపుదురు. సామాన్యముగ చెప్పుడు మాటలు ఆనోట, ఈనోట వ్యాప్తినంది సత్యదూరము లగును. చెడును వ్యాపించినంత సులభముగ మంచి వ్యాపించ నేరదు.

అపవాదు సర్వసామాన్యమగు నొక అవగుణమయి పోయినది. కనుకనే దీనిచే మానవ సంఘమున విషాదము, నష్టము సంభవించుచున్నవి. ఈ క్షణమువరకు మంచిగ భావించిన విషయమును మనుష్యుడు అపవాదు వినిన మరు క్షణముననే చెడ్డగ భావించగడంగుచున్నాడు. దీనికి కారణము అపవాదులోగల వ్యాపక దుష్టప్రవృత్తియే. ఇయ్యది సత్యభాషణముయొక్క సద్గుణమును గ్రహించని మనుజుల యందే నమ్మికను కలిగించుచుండును. పరులు వ్యాపింపజేయు నీలాపనిందలను నమ్మి వానిని వ్యాపింపజేయ నలవడువ్యక్తి మరి యే మనుజుడేని తనపై అపవాదులను వేసిన అది తెలిసి క్రోధానల జ్వాలాపరీతుడగును. తత్పర్యవసానముగ అతనికి సుఖనిద్ర పట్టదు. కలత నిద్దురతో సతమతమగును. మన శ్శాంతి మటుమాయమగును. ఆతడు తన సమస్త దుఃఖము లకు, కష్టనష్టములకు ఇతరులే కారణభూతులనియు, వారు విశ్వసించు అపవాదుపూర్ణములగు వాక్యములనే మూల కారణములుగభావించుచున్నడు. అతడు పరులుతనపైవేసిన అభాండములను విశ్వసించుటలో తాను వేగిరపడుటయే తన

సకల దుఃఖములకు మూలకారణ మను పరమసత్యమును గ్రహింపలేకున్నాడు.

సత్యసంధుడు, సద్గుణసంపన్నుడు, నిత్యసత్యభాషణ వ్రతనిరతుడు, విశుద్ధాంత కరణుడు కటువచనముల కెన్నడు తన చిత్తసీమను తావొసంగడు. తన్నుగూర్చి వ్యాపింప జేయు బడు అపవాదులకు కోపముజెందడు. చిడుముడిపాటు నొంద డు. అందువలన నతడెట్టి క్లేశమునకు, క్షతికి గురికాడు. పరులపై అభాండముల వేయు దుర్వృత్తికి బాల్పడినవారు సజ్జనులపై కొంతకాలమే అపవాదులచే చెడ్డను వ్యాపింప జేయగలరు కాని ఎల్లకాలము చేయజాలరు. సూర్యరశ్మికి మంచు విరియునట్లు కొంతకాలమునకుబిదప సజ్జనునిపై వ్యాప్తి నందిన అపవాదు పటాపంచలగును. సజ్జను డెట్టి అపవాదు లచే కొొలదికాలము తన సత్కీర్తి వెలవెలబాటు నందుట గాంచవచ్చును. కాని అతని విశుద్ధత కెట్టి కళంకము వాటిల్ల నేరదు. వాని చరిత్ర నిర్మలమయి, తేజో విరాజితమయి వెలయగలదు. ప్రతి మనుష్యుడు స్వయంకృతమునకు బాధ్యుడు. అన్యులారోపించు దోషములకు గురికావచ్చునే కాని తన్మూలమున ఆ సజ్జనునకు కలుగు కష్టనష్టములు సున్న. అట్టి సజ్జనుని అంతరంగమున తన్నల్లరి పాలు గావిం చిన జడమతి పయి నెట్టి ప్రతీకారవాంఛయు మొలకెత్తదు. అపకారికి నుపకారము నెపమెన్నక సేయు వాని నిర్మల చిత్త ప్రవృత్తి అతనికి అచంచలము, సుస్థిరము నగు మధుర శాం తిని ప్రసాదించును.

విశుద్ధము, వివేకసంపన్నము, క్రమబద్ధము, సుసంఘటితమునగు జీవితమునకు సత్యభాషణము ప్రాతిపదిక. విశుద్ధ జీవయాత్ర సలుపగోరు మనుజుడు ప్రపంచమందలి కష్టజాలమును, సంతాపక్లేశములను తగ్గించగోరు వ్యక్తి తన తలంపులో, మాటలో, చేతలో అనగ త్రికరణముల అబద్ధమును, అపవాదులను పరిత్యజింప వలయును. ఇట్టి చెడుగులపొంతకు వెళ్లనంతమాత్రమున చాలదు. పొరపాటునేని వాని ఊసైన నెత్తరాదు. ఏలయన అర్ధసత్యమునకు మించిన భయంకర విషయ మొండులేదు. ఇది అసత్యముకంటె, అపవాదుకంటె భయానకము. అతడు కలుషితవాణి నాలకించి తననోట నుచ్చరింపరాదు. దుర్భాషలాడువాడే దుఃఖభాజనుడు. క్లేశపరీత చిత్తుడగు నతని దుస్థితికి సజ్జనుడు జాలిపడును. మిథ్యాభాషి సత్యభాషణ సంప్రాప్తమగు పరమానందము ననుభవింపజాలడు. అపవాది శాంతి సామ్రాజ్యమున ప్రవేశింపజాలడు. మనుజుని నుడువులే వాని మనోదర్పణము. వీని వలననే మానవుని గురించి మన కేర్పడిన భావము స్థిరమగుచున్నది.

"సత్యమేవ జయతే నానృతం"

సత్యము జయించును. అసత్యము జయించదు.

— ముండకోపనిషత్తు

"సత్యాయ మిత భాషిణాం"

— కాళిదాసు

# సమదృష్టి

సమచిత్తుడు ప్రశాంత చిత్తుడనబరగు. తన జీవితమున ఘటిల్లు సంఘటనలకు చిత్తవిక్షేపము నందు వ్యక్తి స్థిర శాంతి నెన్నటికిని బడయ జాలడు. జీవిత ఘటనలయెడ సమదృష్టి గలిగియుండుటె జితేంద్రియత్వ మనబడుచున్నది.

వివేకవంతుడు వీతరాగి. అతడు సమస్తవిషయములను చలింపని మనస్సుతో, నిష్పక్షపాతబుద్ధితో నెదుర్కొనుచుండును. అతడు విషయాదుల కతీతుడగుటచే స్వపక్ష పరపక్ష భేదబుద్ధి లేక సమస్త జనులయెడ సమదృష్టి, సహానుభూతిగలవాడయి తనకు సంఘమునకు మధ్య శాంతి నెలకొలుపుచున్నాడు. శాంతి స్థాపకుడు సంఘర్షణలను చెలరేగనీయడు.

ఏక పక్షాభిమాని స్వపక్షమునే సత్యసమన్వితముగ భావించును. ప్రతిపక్షముయొక్క నిజాయితీని గుర్తింప నొల్లడు. అందలి మంచిచెడ్డల గూర్చియు, నిజానిజముల గూర్చియు నాలోచింప నిచ్చగింపడు. తన్ను సత్యసంధుని గను, ప్రతిపక్షుని మిథ్యాభాషిగను తలపోయుచుండును. అతడు తనపయి వచ్చు దాడుల నెదుర్కొనుటయందును, ఆత్మరక్షణయందును నిరంతరము భయాందోళిత చిత్తుడగు

చుండును. సముచిత్తమువలన సిద్ధించు పూర్ణశాంతి ప్రయోజనము నాతడు కొంచెమేనియు గుర్తింప జాలకున్నాడు.

సమచిత్తుడు తన చిత్తమున బొడసూపు ఇంద్రియ ధర్మముల, పక్షపాత భావముల నిరోధించ కటిబద్ధుడగు చుండును. ఇట్లాచరించు మనుజునియందు పరులయెడ సహానుభూతి ప్రవర్ధమాన మగును. పరుల గౌరవ ప్రతిష్ఠల గుర్తించును. అతడన్యుల నర్థము చేసికొనుటచే వారియెడ ద్వేషమును విడనాడును. పరులకు ప్రతికూలముగ వర్తించుటలో తనకుగల మౌఢ్యమును తెలిసికొన నారంభించును. ఈచందమున వాని ఎనలేని ఔదార్యసంపద పెంపసలారును. అది అనంతము, అపారముగ నుండును. వాని అట్టి ఔదార్యము సమస్త జీవరాసులపై తన సత్ప్రభావమును ప్రసరింపజేయును.

మానవుడు ఇంద్రియధర్మములకు వశంవదుడయిన, పక్షపాతమునకు లోబడిన ధర్మాంధుడగును. అందుచే నతడు ఏ దశయందును సమధర్మమును నిర్వర్తింపజాలడు. అతని చూపు సంకుచితమైనందున స్వపక్షమంతయు మంచితో నిండియున్నట్లును, విపక్షమంతయు చెడ్డతో నిండియున్నట్లును చూచును. అతడే వస్తువును దాని వాస్తవిక రూపమునందు గాంచజాలడు. ఇంతయేల కడకు స్వపక్షమందలి యథార్థ స్వరూపమునేని సాక్షాత్కరింపజేసుకొన జాలడు. తనస్థితిని సయితము తాను సరిగ గ్రహింపనేరడు. అన్యుల హృదయములను గ్రహింపజాలక వారియెడ తనకు గలుగు ద్వేషము సముచితమను పొరపాటుయందే కాలము గడుపుచుండును. తనతో నేకీభవింపక, తన్ను ప్రేమింపక తనపై

ద్వేషమును వర్షించువారియెడ తన చిత్తసీమను క్షుద్రము లగు ద్వేషాంకురములు తలయెత్తును. అతడు తన స్నేహితులకు, సహచరులకు దూరుడగును. ఇందుమూలమున నతడు సంకుచిత అంధకార బంధుర మందిరమున నిత్యక్లేశ పరీత జీవియై తన మనుగడను భారముగ దొర్లించుకొనుచుండును.

సమచిత్తుని జీవితము మధురమయి, శాంతియుతమయి, సత్ఫలదాయకమయి, ఆనందమయమయి అలరారుచుండును. అతడు స్వబుద్ధిచే ద్వేషమునకు, దుఃఖమునకు దెన్నుజూపు మార్గముల నతిక్రమించును. అతడుసదా ప్రేమ, శాంతి, ఆనంద పథముల కేగు మార్గమున పయనించు చుండును. జీవితమున దారలు నిత్య సంఘటనల ప్రభావ మతనిపై ప్రసరింపజాలదు. దుఃఖప్రారితము లని జనులు భావించు విషయముల నతడు సరకుగొనడు. కాలవశమున సకల జనులు అనివార్యముగ అనుభవించవలసిన విషయములగూర్చి అతడు చలింపడు. ఆవేదనజెందడు. అతడు జయమునకు పొంగడు; పరాజయము నకు క్రుంగడు. అతడు తన జీవిత సంఘటనల వేనికెంత విలువ నీయవలెనో అంతే యిచ్చుచుండును. అతడు చెల్లని, తగని స్వార్థచింతలకు తన చిత్తమునం దెడమీయడు. అకారణము, నిరర్థకమునగు శోకమునకు దారితీయు చెయిదములకు మొగ్గడు. వ్యర్థములగు పేరాశలకులోనయి గాలి మేడలను గట్టడు. అనుభవశూన్యుడగు బాలకునివలె కార్యరంగమున హాత్తోత్సాహి కాడు.

ద్వంద్వముగ చరింపని ఈ స్థిర చిత్తప్రవృత్తి, మనోజ్ఞ మగు జీవితముయొక్క ఈ రమణీయావస్థ, మనస్సుయొక్క

ఈ సుందర సుస్థిరదశ మనుజునకు లభించు టెట్లు? మనుజునకు సమదృష్టి, సమభావము ఇంద్రియ నిగ్రహమునలన లభించును. ఇంద్రియనిగ్రహముచే మనుజుడు ఆత్మసామ్రాజ్యమున కధినేతయగును. అపుడతని హృదయము విశుద్ధమగును. అపుడతని వివేచనాపటిమ నిశితము, పక్షపాత రహితమునయి విలసిల్లగలదు. పక్షపాత రహితమగు వివేచనాశక్తి వలన మనస్సులో సుస్థిరత నెలకొనగలదు. ఇట్టి మానసిక సమభావముచే శాంతిలభించును. పరిశుద్ధాంతఃకరణములేని మానవుడు వివిధములగు మనోప్రవృత్తుల ప్రవాహతరంగముల బడి అసహాయుడయి కొట్టుకొని పోవుచుండును. కాని నిష్కళంక చరిత్రుడు ప్రవాహముల కెదురీది చిరవిశ్రాంతియనెడి సౌకాశ్రయమును చేరుచున్నాడు. మూర్ఖుడు తానుపట్టిన కుందేటికి మూడే కాళ్లను సంకుచిత భావముచే ఎదుగుబొదుగులులేక పడియుండును. బుద్ధిశాలి శుష్కప్రసంగములుచేయక కార్యతత్పరుడయి ముందునకు సాగిపోవుచుండును.

> సుఖ దుఃఖములను, జయాపజయములను, లాభ నష్టములను లెక్కచేయక అర్జునా! నీవు సమబుద్ధితో యుద్ధముచేయ నారంభించినచో నీకే పాపమును గలుగదు.
>
> — భగవద్గీత

> ఆ. వె. "ప్రియము నప్రియంబుఁ, బెల్లగు సౌఖ్య దుః
> ఖములు భూత భావికార్యములును
> నెవ్వనికి సమంబు, లివి సర్వ ధనియనఁ
> బరగు జువ్వె యట్టి, భవ్యుడనఘ!
>
> — మహాభారతం అర. 7 ప. 454

# సత్ఫలితము

మన జీవితములో అనేక సంఘటనలు మన యిచ్ఛా నిచ్ఛలతో నిమిత్తము లేకయే జరుగుచుండును. ఇట్టి సంఘటనలతో మనకెట్టి సంబంధము లేదని మనము భావింతుము. ఇవి విధివశమున నిర్హేతుకముగ జరుగుచుండునని మనము తలంతుము. మన మొకనిని అదృష్టవంతుడందుము. వేరొకనిని దురదృష్టవంతుడందుము. కర్తృత్వము లేకయే, కష్టపడకయే, అయాచితముగ ఏదేని యొక వస్తువు, సంపద హస్తగతమగునని ప్రతియొక్కరు భావించుచుండుట మనము నిత్యము చూచుచున్నాము. కాని సూక్ష్మబుద్ధితో విచారించుము. అంతర్దృష్టితో గమనించుము. ఈ సృష్టిలో ప్రతి విషయము, ప్రతి కార్యము నిర్హేతుకముగ జరుగుననుట అసంగతము. కారణములేని కార్యముండదు. కారణ కార్యములకు పూర్ణసామ్యము, అవిరామమగు అవినాభావ సంబంధముకలదను విషయము లోకముయొక్క పోకడను పరిశీలించిన వారికి స్పష్టపడగలదు. కారణ కార్యములు రెండును తోడ్తోడనే నడచుచుండును. ఇవి ఛాయాపతముల బోలినవి. కనుక జీవితమున మనపయి ప్రత్యక్ష ప్రభావమును ప్రసరింపజేయు సమస్త సంఘటనలు మన అభిలాషలతో, మన చరిత్రతో సన్నిహితమగు సంబంధమును గలిగియే యున్నవి. ఇట్టి ప్రభావమునకు గల సహజ సంబంధము మన అంతఃకరణమం దుదయించు ఆలోచనా పరంపరలపయి ఆధారపడి

యున్నది. మన జీవితములో తలవని తలంపుగ జరుగుచుండు సంఘటనలు సయితము మన ఆలోచనలకు, మన కర్మలకు గలుగు ఫలితమే సుమీ! ఈ సూత్రము స్థూలదృష్టికి బాహాటముగ గోచరింపక పోవచ్చును. అది అంగీకరింపవలసిన విషయమే. కాని భౌతిక ప్రపంచములో దీనికిమించిన సుస్పష్టము, సునిశ్చితము, సుస్థిరము నయిన జీవనసూత్ర ముండ నేరదు. భౌతిక పరమాణువుల పరస్పర సంబంధమును దెలుపు సిద్ధాంతముల నన్వేషించుటకు పరిశోధన, ఆవిష్కరణము ఆవశ్యకములయి యున్నవి. ఈ చందముననే మానసిక వృత్తుల పరస్పర సంబంధమును దెలుపు కారణ కార్యముల నియమముల దెలుసుకొనుటకు సయితము ఆలోచన, మననము, చింతనము ఆవశ్యకములు. ఇట్టి నియమముల సత్కార్యాచరణముచే తన మనస్సును వికసితము గావించుకొనిన సదాచార సంపన్నుడే తెలుసుకొనగలడు.

'మన మేది విత్తుదుమో అదియే కోయుదుము' ఇది స్థిర సిద్ధాంతము. మన జీవితములో అనేక విషయములు మన కోరిక ననుసరించి జరుగకపోవచ్చును. అట్లు జరుగ కుండుటకు కారణ భూతులము మనమే. ఇది నిర్వివాదాంశము. మద్యపానము సేయువాడు వ్యర్థప్రలాపముల వదరు నిమిత్తము మద్యమును పానముసేయడు. దుష్కృతముల కతడు వశీభూతుడయి ఈ దుస్థితికి జిక్కుచున్నాడనుట సత్యము. ఈ దృష్టాంతము ఉపర్యుక్త సిద్ధాంతమును ఋజువు చేయుచున్నది. ఈ నియమము ఇంత సుస్పష్టముగ గనబడని తావునగూడ దీని వాస్తవికతను సందేహింపబనిలేదు. మనకు

గలుగు విషాదములు, మన సమస్త సంతాపములు, మన సంపూర్ణ సకల సంతోషములు అన్నిటికిగల మూలహేతువు మన అంతరంగమందే కలదు. నీవు నీ భావ ప్రపంచాంతరాళ మును మార్చుకొనుము. అపుడు నీకు జీవన సంఘటనలచే రూపొందు బాహ్య ప్రపంచమునుండి నీ కెట్టి దుఃఖము వాటిల్లదు. నీవు హృదయమును పరిశుద్ధ మొనరించుకొనుము. అపుడు సకల వస్తుసంతతులు నీకు పరమ పవిత్రములుగ గోచరించును. సమస్త సంఘటనలు సౌఖ్య సంభరితములు గను, సంతోషప్రదములుగను, శాంతి సంధాయకములుగను, నియమ బద్ధములుగను గనబడుచుండును.

మన జీవితము "యాదృశీ భావనా యస్య సిద్ధిర్భవతి తాదృశీ" అను సూక్తి ననుసరించి ఉత్తమముగనో, అనుత్త మముగనో, స్వతంత్రముగనో, పరతంత్రముగనో నిర్మాణ మగుచుండును. మన భావనలనుబట్టియే మన కర్మలు రూపొందుచుండును. ఆ కర్మలనుబట్టియే సత్పరిణామములో లేక దుష్పరిణామములో కలుగుచుండును. తస్కరుడు అక్రమ ముగ, రహస్యముగ ఇతరులనుండి వారి సొత్తును గుంజుకొను నట్లు మనము సత్ఫలితముల కొరకై అక్రమముగ బడయ జాలము. మనము వానిని మన ఆంతరంగిక కారణముల వలననే పొందగలము.

జనులు విత్త సముపార్జనమునకు ప్రయత్నించుచుం దురు. సుఖప్రాప్తికి తహతహ పడుచుందురు. అత్యుత్సాహ ముతో మిక్కిలి మక్కువ గలిగి జ్ఞాన సంపాదనమునకు కృషి సేయ నభిలషించుచుందురు. కాని వారు వీనిని బడయ జాల

కున్నారు. ఈ సంపదలనే కొందరు సునాయాసముగ బడసి సుఖ మనుభవించుచుండుటను వారు గాంచుచుందురు. ఇతరులవలెనే తామూ వస్తువుల బడసి సుఖ మనుభవింప జాలకపోవుటకు గల కారణములు గలవు. వారు తమ మనోభీష్టముల సిద్ధికి, తమ ప్రయత్నముల సఫలతల కనుగుణములగు సాధన సంపత్తిని సృష్టింపజేసుకొనకుండుటయే వారి ఆశాభంగమునకు కారణము.

సమస్త జీవితములు కార్య కారణములు, ఉద్యోగ నిరుద్యోగములు పరిణామములచేకట్టుదిట్టముగ అల్లబడిన వలవలెనున్నవి. ఉత్తమ కారణము, ఉత్తమ ప్రయత్నములచే కార్యాచరణకు గడంగుదుమేని ఉత్తమ ఫలితములు తప్పక సిద్ధింపగలవు. సముచిత న్యాయ సిద్ధాంతము ననుసరించువాడు సిద్ధికయి పోరాడ బనిలేదు; నిరీక్షింప నవసరములేదు. నిష్కళంక సచ్చరిత్రమునకు ఫలితముగ వానికి సత్ఫలితములు తామయి లభింపగలవు. అతడు స్వకర్మల కుచితమగు ఫలితము పొందగలడు. సంతుష్టాంతరంగుడగు నతడీ ఫలితమును ప్రశాంతముగ ననుభవించును.

మానవ సంఘమున 'విత్తినదే కోయుదువు' అను ఈ నగ్న సత్యము, అతి సరళము, సహజము, నిత్యానుభవైకవేద్యమయినను జనులు దీనిని ఎంతో కాలమునకుగాని గ్రహించుటలేదు. ఎప్పటికోగాని ఈ పరమ సత్యము వారి దృష్టికి గోచరించుటలేదు. ఒక ధీమంతుని సుభాషితమిది:- "అంధకారమున నడయాడు మనుజులు వెలుతురులోనున్న మనుష్యులకంటె వివేకవంతులుగ నుందురు." భౌతిక ప్రపం

చమున విత్తకయే, మొక్క నాటకయే ఫలము నాశించు వ్యక్తి యుండునా? తుమ్మ చెట్టును నాటి దానినుండి మామిడి పండుకయి అర్రులుచాచుట శుద్ధ అవివేక మనుట నగ్న సత్యము. ఈ సత్య సిద్ధాంతమును మానవ జీవితము యొక్క పుటలనుండి తుడిచివేయ నేరికిని సాధ్యముకాని పని. సత్య మీ చందమున కన్నుల మ్రోల సాక్షాత్కరించు చున్నను మానవులు యీ తికమకలకు గురి యగుచునే యున్నారు. వారు చెడుచేసి దానికి ప్రతిఫలముగ సత్ఫలితము నాశించుచున్నారు. తామాచరించు పాపమునకు పుణ్యమును మూట గట్టుకొన జూచుచున్నారు. పాపము పరిపక్వమయిన నంత నిరాశోపహతు లగుచున్నారు. తమ దుర్విపాకము నకు దురపిల్లుచున్నారు. తన్మూలమున తమ్ము జుట్టిపెట్టుకొను అన్యాయములకు, క్రూర ఫలితములకు గురియగు పశ్చాత్తాప తప్తులగుచున్నారు. వారికి సంప్రాప్తించు తమ దుఃఖములకు, కష్టములకు అన్యులను, అన్యుల దుష్క్రియలను కారణము లుగ పేర్కొనుచు వాపోవుచుందురు. అజ్ఞానులగు వారు దుఃఖకారణము మిన్నుపయినుండి బడలేదను రహస్యము నెరుంగరు. అది తమ అంతఃకరణముననే, తమ ఆలోచనా ప్రపంచముననే, తమ కార్య జగత్తులోనే గుప్తముగ నున్న దను విషయమును సయితము వారు గ్రహింపకున్నారు.

తోటమాలి విత్తినదానినే కోయవలసియున్నదను సూత్ర మును తు. చ. తప్పకుండ పాలించును. ఇదియే చందముత మహోత్తమ స్వభావముగల మనుష్యులు, తమ సౌఖ్యముల కయి యథార్థములగు మూల సిద్ధాంతముల నన్వేషించి అనుస

రించు సత్పురుషులు కారణ కార్యముల మహత్తర సూత్రమును త్రికరణముల శిరసావహించి అనుష్ఠించుట ధర్మము. తోటమాలి ఉద్యాన కృషికి సంబంధించిన ప్రాథమిక సూత్రముల గురించి ఎట్టి సందేహముల కలిగియుండడు. అతడు దాని మూల సూత్రముల అవగతము చేసుకొని ఆచరణలో పెట్టుచున్నాడు. తోటమాలి తన ఉద్యాన కృషి విషయములో ఏ బుద్ధిని వినియోగించుచున్నాడో జనులు తమ మనోవాటికల కృషియందట్టి పద్ధతినే అభ్యసింపదగును. నిస్సందేహచిత్తులయి ప్రజలు తమ సత్కర్మబీజముల విత్తునట్టి నియమముల సులభముగ గ్రహింతురేని తమకు తామేయు వారే త్రికరణశుద్ధిగ ఆ కర్మల నాచరించుటకు వలయు నియమముల పాటింప గడంగుదురు. తన్మూలమున వారు సుఖము, కార్యాచరణ పాటవము బడయగలరు. భౌతిక ప్రపంచమున భౌతిక నియమములు అనివార్యము లయినట్లు ఆత్మ ప్రపంచమున ఆధ్యాత్మిక నియమముల పాటించుట తప్పనిసరి యగును. భౌతిక నియమములకును, ఆధ్యాత్మిక నియమములకును సుంతేని భేదములేదు. అవి కేవలము ఒకే నాణెముయొక్క రెండు పార్శ్వములు. రెంటికిని సిద్ధాంతమొకటియే.

సముచిత సిద్ధాంతములు, ఉచిత సాధనముల ననుసరించి కార్యాచరణకు గడంగినవానికి దుష్ఫలిత మెన్నటికి గలుగనేరదు. మనము మంచి నియమముల ననుసరించి మన జీవితమును గడుపుకొందుమేని మన జీవిత రంగమందెట్టి నిరుపయోగమగు విషయ ముండనేరదు. మన చరిత్రయును

భవనము ఓటు లేక దృఢముగ నుండగలదు. మనము సత్కార్యముల జేయుదుమేని సత్ఫలితములే కలుగగలవు. హేతువులు మంచివైన ఫలితములు అన్యథా ఎట్లగును? మామిడి చెట్టునకు తుమ్మకాయలు కాయునా?



ఈ నీతి గ్రంథమునందు బహు విషయములు క్లుప్తముగ చర్చింప బడినవి. అవి జీవన సూత్రములకు సంబంధించినవి. ఈ సూత్రముల ననుసరించి జీవితమును తీర్చి దిద్దుకొను వ్యక్తి సూక్ష్మదర్శి, స్థితప్రజ్ఞుడు కాగలుగుచున్నాడు. అతడంత సదా సౌఖ్యవంతుడయి నిత్యానంద శాంతుల నోలలాడగలడు. అతని కార్యము లన్నియు క్రమపద్ధతి ననుసరించి జరుగుచుండును. అతని కార్యకలాపములు, ప్రయత్నములు సుఖదములు, శుభదములయి యొప్పారుచుండును. అట్టివ్యక్తి కుబేరుడు కాకపోవచ్చును. అతని కట్టికోరిక సయితముండదు. కాని యాతడు జీవితమున పరమ శాంతిని బడసి కర్మరంగము లన్నింట విజయలక్ష్మిని వరించు సౌభాగ్యమునకు నోచుకొనగలడు. ఇంతకంటె మానవ జీవితమునకు పరమార్థ మేమున్నది?



"తే. గీ. అవని జల్లిన దెద్దియో అదియె పండుఁ
గారణంబును అట్టిదే కార్యముండు
చెడ చెడుకున్ మంచి మంచికిని గదు
దీని తప్పించుకొనియెడి తెరువు లేదు."

— శ్రీ వివేకానందస్వామి

# సు భా షి త ము లు

చెల్లియుండియు సైరణ సేయు నతడు
పేదవడియును నర్థికి బ్రియముతోడ
తనకుగల భంగి ఇచ్చునతండు పుణ్య
పురుషుడని చెప్పిరార్యులు కురువరేణ్య!

— భారతం

తనువున విఱిగిన యలుగుల
ననువున బుచ్చంగవచ్చునతి నిష్ఠురతన్
మనమున నాటిన మాటలు
వినుమెన్ని యుపాయములను వెడలునె యధిపా

— భారతం

జరయు మృతియులేని జనునట్లు ప్రాజ్ఞుండు
ధనము, విద్యగూర్పదలప వలయు
ధర్మమాచరింపదగు మృత్యువుచే దల
పట్టి యీడ్వబడిన వాడువోలె

— చిన్నయసూరి

మనమునకు హితంబును
ప్రియమును బథ్యము
తథ్యము అమోఘము మధురం
బును పరిమితమును
నగు పలుకొనగగ పలుకుట
ధర్మయుతమగు సభలన్ — భారతం




"పాతకోటు తొడుక్కో
కొత్త పుస్తకము కొనుక్కో"

— థోరో

భూషలకు వెచ్చించు ధనము కంటె ఉత్తమ గ్రంథము నకు వెచ్చించు ధనము సార్థకమని దీని తాత్పర్యము.